    

శ్రీ రామ...

శ్రీ వేదశైలయోగానంద ...మః




# ప్రహ్లాద పట్టాభిషేకము

### ఇష్టదేవతాస్తుతి

శా॥ శ్రీనుద్భాసదురగ ప్రదేశమున న । ద్ధిందాల్చి రక్షోర్భకా ।
త్మానందాంబుధి కైందవోన్నతిగ శాం । తాధీశుచే శ్రుత్యగ
స్థానఖ్యాత నిజస్వరూపుడగుచుం । సద్భక్తులం బ్రోచు యో ।
గానందాహ్వయ నారసింహుడు సమ । గ్రైశ్వర్యనం జేయుతన్ ॥

### గురుస్తుతి

శా॥ సారోదారుని మల్లిపెద్దికులు కృ । ష్ణబ్రహ్మమున్గొల్చి త ।
త్కారుణ్యంబున దాచతుర్థపురుషా । ర్థ శ్రీనిగైకొన్న వి ।
ద్యారాశింబరతత్వగుందిరునగ । ర్వ్యాఖ్యాన్వవాయుం శుభా ।
చారున్ గృష్ణగురుంభజింతు హృదయా । బ్జాతంబునందెప్పుడున్ ॥

### ఆర్యస్తుతి

శా॥ శ్రీమద్భాగవతంబు నాంధ్రమున సం । ప్రీతిందగన్గూర్చి శ్రీ ।
రామాధీశునకిచ్చి మోక్షపదమున్ । రమ్యంబుగాగొన్న శ్రీ ।
రామాధీశపదారవింద మధుసా । ర గ్రాహకేందిందిరో ।
ద్దామాత్మున్ భజియింతు బమ్మెరకు । లాధారున్ గురున్ బోతనన్ ॥

వ॥ శ్రీమద్ధర్మార్థకామ మోక్షచతుర్విధ పుణ్యఫలంబులనొసంగు నైమిశారణ్యంబున సూతుండు శౌనకాద్యఖిల మునిగణసమేతుండై హరికథాశ్రవణ కాలక్షేపంబుజరుపుచున్నయెడ నారదుండచ్చోటికి వచ్చి కీర్తనంబొనరింపుచు నరుగుదెంచినం, దాపసులందరభివందనపూర్వకంబుగా, నభ్యర్చించి యుచితాసనంబునంగూర్చుండ నియోగించి, యఖిలధర్మస్వరూపుండును, యోగీశ్వరేశ్వరుండునగు దేవమునింజూచి, సూతునికనుసన్నబడసి, శౌనకుండిట్లనియె॥

శౌనకుడు— ఋషివర్యా పరమభాగవతోత్తముండగు ప్రహ్లాద పట్టాభిషేకమహోత్సవ మెవరియాజమాన్యమున జరుగబడినది.

నారదుడు—కులగురుండగు శుక్రాచార్యులవారి యాజమాన్యమున నేజరిగినది.

శౌన— ప్రహ్లాదుండుపరమసాత్వికుండనియు, దమపాలిటికి భగవంతుండనియు, నిజశాత్రవద్వేషంబునన్ దమనాపత్సముద్రంబునందుండి యుద్ధరించినవాడనియును, స్వపక్షపాతియనియు, భుజతాండవంబు సలుపు యింద్రాదిదేవ సమూహంబును, తద్గురుండగు, గురుండును, స్వాతంత్రియ పట్టాభిషేకులై యుండిరిగదా. రాక్షసగురుండగు శుక్రాచార్యులవారి యాజమాన్యముక్రింద నుండుట కెట్లుత్సహించిరి.

కాక గురు, కుల, పితృ ద్రోహియునగు ప్రహ్లాదుని దూషింపక శుక్రాచార్యులిట్టి యాజమాన్యమున కొడంబడియె, త్రిలోకాధీశుండును, దనప్రియశిష్యుండునగు హిరణ్యకశిపుని యందుగలిగించిన యపవాదును, హింసను, పొడగాననిదశను, మనంబున దేకుండువాడుకాడు. యింతకు కారణుండగు బృహస్పతియెదుట ప్రహ్లాదుని మోమెట్లుగాంచి సంతోషస్వాంతుండయ్యె నట్టియెడ నెట్టిమహోత్సవంబుజరిగె, దత్తద్దోషపరిహారంబులతో, దత్సన్నిధాన మంగళాశాసనకర్తలగు మీరు మాకెరింగించి శ్రవణానందం బొనరింపుడు.

అందుకు నారద రుషీంద్రుండిట్లుపన్యసించెను.

నార—తాపసవర్యులారా, ప్రహ్లాదపట్టాభిషేక మహోత్సవకాలం

బున, మీరుద్దేశించినట్లే బృహస్పత్యాదులు భుజతాండవంబులు సలుపు టయును, శుక్రాదులసూయాద్యభిమానులై యుండుటయు కలిగినది, అట్టియెడ పద్మాసనుండు ప్రహ్లాదునింగాంచి, సభామధ్యంబుననుభ యవాదులు వినుచుండ నిట్లనియె .

బ్రహ్మ—ప్రహ్లాదునింజూచి, బాలకా నిన్ను రక్షోనాథునిగా నభిషే కింప ముహూర్తము నిశ్చయింపనున్నారము, కాలంబంతయు నెందెంత వి నియోగపడవలసియున్నదో దెల్పుమన నతడిట్లనియె

ప్రహ్లా—మహాత్మా- మీరెరుగనిదేమున్నది, యైన మీయానతింద్రోయరాదు, గావున దేవరవారానతిచ్చిన ముహూర్తకాలముదప్ప, దక్కి ననాకుగల కాలంబంతయు, మాకులగురుండగు శ్రీశుక్రాచార్యులవారి యాశీర్వచనమునకు నర్పించితి నని జవాబుచెప్పె, బహుళార్థ సంపుటీ కరణంబగు నావాక్యంబువిననతోడనే, బృహస్పత్యాదు లుత్సాహంబు లొక్కమారెడిగ్గి, క్షణకాలంబు వారివారిమనంబులు నానావిధలోకం బులు సృజింపబడినవై, యెట్టకేలకు బహిస్పృహ గాంచి, తమలో దా మిట్లని వితర్కించిరి.

సభ్యులు—పరమసాత్వికుండని నమ్మితిమిగాని యితడుహిరణ్యకశిపు నికొడుకేననియనువారును, ఆత్మావైపుత్రనామాసి అను శ్రుత్యర్థము వ్య రమాయనువారును, ఎంతసాత్వికునకైనను తనుగుణంబులుదోచుట స హజమనువారును తనుగుణంబులు నిత్యంబులుకావుగాని తనువుగలవరకు దోచకతప్పవనువారును యెంతసాత్విక పక్షపాతియైనను కులధర్మంబు విడువవచ్చునా యనువారును, అట్లైనధర్మంబులన్నియు జెడకుండవల యునుగదా యనువారును, యెట్లోతండ్రికి శాపవశమున సంభవించిన రాక్షసజన్మవిమోచనార్థం బిట్లునటించెననువారును అపుత్రస్యగతిర్నాస్తిగ అనియుండుటవలన పుత్రుడైనతాను భగవంతునిద్వారా తండ్రిని సుగతిని బొందించెననువారును హిరణ్యకశిపుండాజన్మప్రభృతి మృత్యుపర్యంతము, రాజస, తామస, వేషంబగు రాక్షసతనువుదాల్చియు ను, యేవిధంబుననైన నానందమునే యనుభవించెనుగాని పుత్రునివలన

న్నేద్రోహంబు జెందినవాఁడుకాఁడనువారును సాత్వికద్వేషియగు హిరణ్యాకశిపునకిట్టి సాత్వికుఁడెట్లుజనించెననువారును, తండ్రులైనను శాపవశంబున నిట్లుండిరేగాని, తొలుత హిరణ్యాక్ష హిరణ్యకశిపులనగా, శ్రీవైకుంఠపురంబున నంతఃపురద్వారపాలకులై నిరంతరము హరినిసేవించుచున్న జయవిజయులుకారా తత్సంబంధ శుద్ధసాత్వికాంశము, తండ్రి రాక్షసతను విమోచనార్థము బింబప్రతిబింబన్యాయంబున జనించెననువారును, పితృవాక్య పరిపాలన మాచరింపని దోషంబీతని బాధింపక తప్పదనువారును, హరిపరాయత్తచిత్తుండగు నీతని కట్టిదోషంబులంటవనువారును, యాయర్థంబులు పితరులపట్ల నూహింపరాదనువారును, పుత్రునియెడ దోచుద్రోహంబులు తండ్రికి సుఖకరంబులుగా దోచెనేని నవి ద్రోహంబుగా పరిగణింపబడవనువారును తనయుందు పుత్రుండుజూపు దుర్నయంబులు తండ్రితనకు పకృతిగాగణింపుచు హేతునిర్ధారణ కభినయించెనువారును తండ్రికి లోకోపవాదమమరించిన దోషంబైన నీతనికిత ప్పదనువారును మోక్షఫలంబనుభవించువారలకు దూషణభూషణ తిరస్కారంబులు జెందవనువారును పితృహంతియను లోకోపవాదం బీతఁ డెట్లుబాపుకొనుననువారును కార్యకారణంబులకు దానుస్వాతంత్ర్యుఁడు కాఁడనువారును, కాకున్న పితృద్వేషాపవాదమున కీతడది ప్రాయశ్చిత్త క్రియగా ననుభవించుననువారును ఆత్మానందమగ్నుండై నిరంతరము స్వేచ్ఛాచరణుఁడగువాని కీరక్షోరాజ్యభారము హరి యీతనితలనిడుట కన్న ప్రాయశ్చిత్తమేమున్నది యనువారును, యెవరిని దూరిననేమి, మనకష్టంబులకంతటికి కారణము, సనకసనంద నాదులేయనువారును, యీ కమలగర్భుండట్టి వరంబులీకున్న మనకిట్టికష్టములు బొడమవనువారును యిదిఅంతయు హరిమాయవిరచితంబు, సర్వజగద్రక్షకుండగు శ్రీహరి గలుగునంతవరకు మనకేకష్టంబులుబొరయవనువారును యిట్లుపలువురు పలువిధంబుల గుసగుసలాడుకొనుచున్న కలకలములు వ్యాపించి దేవగురుండిట్లనియె-

బృహ.—మీరేలపలువిధంబులచింతించెదరు, రాక్షసులను సాత్వికని




ష్టప్రాప్తులజేయ కారణుండును, సురాసురైక్య సంధానరూపుండునగు, ప్రహ్లాదునియందేదోషంబులేదు. కులగురువునందుగల భక్తివిశ్వాసంబును యెరుకపడ, పరమధర్మంబుసూచించె, నీతండు హరినిఁగొలినవాడు, రక్షోరక్షణార్థంబు తండ్రియే తనసాత్వికాంశంబుడించిపోయె, నిట్టి పరమపుత్రునిగాంచిన హిరణ్యాకశిపుండును, పరమవిశ్వాసపాత్రుడనక తప్పదు, మనకుగలిగిన కష్టమ్ములకు కారణము, ప్రారబ్ధంబగుటంచేసి, యది యనుభవింపకతప్పదు, తత్ప్రారబ్ధంబులైనను భాగవతోత్తముల యెడ భద్రప్రదంబులై పరిణమించును, యెట్లోహరిదరిశనంబుగలిగె, యేతద్దర్శనకారణులగు వారందరు భిన్నములుగాదోచు గురుస్వరూపుల ని నానిశ్చయము. ఇంక నసూయాద్యవగుణంబులువీడి, పద్మాసనుయాజ్ఞ సిరసావహించి, నిత్యానందప్రారంభకాలమగు, నీప్రహ్లాదుని పట్టాభిషేక మహోత్సవముగాంచిననుగాని హరిదర్శన సంపూర్ణత్వము మనకు పొందదని సభాముఖంబున బ్రకటించె, నంత రాక్షసగణ పరివృతుండై యున్న శుక్రాచార్యుండిట్లని యుపన్యసించె-

శుక్రా—రక్షోవీరులారా, యీసభాముఖంబున దేవగురుండానతిచ్చిన వాక్యంబులు యదార్థంబులును, పరమధర్మప్రతిపాదితంబులైయున్నవి, రక్షోనాథుండగు హిరణ్యాకశిపుండంతరంగసాత్విక నిష్టుండని యేనెరుంగుదు, గాకున్న హరిచేనెట్లుమృతిసంభవించును, నతండు కన్నకుమారుని బాధించెననరాదు, హరిని గనుగొనదలచు తనమనోరథము నెరవేర్ప గలవాడగునో, కాడో, యనుసంశయనివారణార్థమట్లు పరిశీలనలొనరించెను. అంతటంతట నాతోడ నీచాలుండు, నన్నుద్ధరించుట కవతరించినాడనియును, దండన సాధ్యుండుకాడనియు దెలుపుచూవచ్చెను, రజ'స మోగుణంబులనైనను హరియందు దీక్షవీడని మనుజులు స్తుతిలగుదురను యర్థమును స్థిరీకరించెను-

భాగ- సప్త- ప్రహ్లాదవాక్యము

కం॥ చిక్కడుద్రవతముల గ్రతువుల॥ కం॥ చాలదుభూదేవత్వము॥

హిరణ్యాకశిపువాక్యము॥ సీ॥ పొందుదానవులార భూసురక్షేత్రి

సంగతమైన భూమికిగములుగట్టి॥

అనుపద్యార్థంబులు నెరింగిన యిరువురు పరమసాత్త్వికధర్మజ్ఞులని దెలియుబడకమానదు విరోధంబున హరినిర్జెందవలయునని తదవయురూపంబులగు ధర్మంబులనుగంట గ్రోసెగాని, యదితరిగానంమున, తనయభీష్టమునకనుకరింపబడవాయెను, పిదపస్వతేజోభవుండును, పరమభాగవంతుడును, భక్తిభావనారతుండును, పరమజ్ఞానియునగు ప్రహ్లాదునివలన దనయిష్టంబు నెరవేర్చుకొనియె, నాప్రియశిష్యుండగు హిరణ్యకశిపునెడగల భ్రమప్రమాదమున గలిగిన యసూయ, నీదేవగురుండగు బృహస్పతి పల్కిన యథార్థవాక్యంబులచేతను, సురమునిగణంబులు పరస్పర విచారలోలురై యుగ్గడించిన వాక్యాంబులవలనను, నాకు ప్రహ్లాదుడొసంగిన గౌరవరూపంబులగు గురుభక్తి నిర్ధారణవచనంబు వలనను బాసె-

మనరక్షోరాజ్యంబీయనఘుని స్వాధీనమగుటవలన నిష్కంటకసుఖంబులనుభవింపగలము. ఉభయవిభూతిదాయకంబగు భాగవతభక్తి మనరాక్షసకులంబున కాలవాలంబయ్యెను హిరణ్యకశిపుని తపఃఫలంబగు, ప్రహ్లాదుని పట్టాభిషేక మహోత్సవంబున సురాసురులేకత్వతగాంచుటగంటిమి, హరిదర్శనంబుగలిగె, సృష్టికర్తయగు పద్మగర్భుండే, తచ్ఛుభకార్యాధ్యక్షుడయ్యె, సర్వవిధంబుల మంగళంబనినుడివిన, బ్రహ్మదేవుండిట్లనియె-

బ్రహ్మ—నేనీరాక్షసరాజగు, హిరణ్యకశిపుని యంతరంగరహస్యమాతనికి వరంబొసంగునాడెరింగితి, తద్వరంబుల నాతండు లక్ష్యార్థభూయిష్టంబులుకాగోరెను- భాగ-స-॥

శా॥ గాలింగుంభిని నగ్నినంబువ్రల నా । కాశస్థలిందిక్కులం ।
రేలంఘుస్రములన్ దమఃప్రభలభూ । రిగ్రాహ రక్షోమృగ ।
వ్యాళాదిత్యనరాదిజంతుకలహ । వ్యాప్తిన్ సమస్తాస్త్ర శ ।
స్త్రాళింమృత్యువులేనిజీవనములో । కాధీశయిప్పింపవే॥ పదార్థము:

వ॥ మరియు రణంబునదన కెదురులేని శౌర్యంబును, లోకపాలురనతి క్రమించుమహిమను త్రిభువనవిజయంబునుగోరెను॥ ఇహార్థము॥

తాత్ప॥ పంచభూతములును, దశదిశలును, రేయింబవళ్లును, జ్ఞానాజ్ఞానములున్ను తత్ఫలరూపమగు జీవకోటులును, తల్లయసాధనంబులగు శస్త్రాస్త్రాదులును, గాక లోకమేమున్నది. లోకములేని సమయమేది యో నదియే మోక్షార్థమగుటవలన, నతడు ముక్తినేగోరెను. ముక్తినొసంగువాడు గురుస్వరూపుండగు శ్రీహరియే గాన, నతనిదర్శనంబు కోరెను. ఇహసుఖంబునకై శౌర్యంబును మహిమయును జయమును గోరెను. యేతద్వరంబులు మోక్షార్థ సూచకంబులును, లోకరక్షణార్థంబులునై పరిణమించుటం జేసి, యాతండు గోరినవరంబులన్నియు నొసంగితి, గావున, నీతండు భగవంతునకు, దనకును, వేరుబరుపరాని పరమపావనుడు, తత్త్వానుభవుండగు ప్రహ్లాదుండు యథార్థస్వరూపుండు గావున, నీయనఘుండు రక్షోనాథుండగుటను మనకెల్లరకు భద్రప్రదంబని ప్రసన్నముఖంబున బ్రసంగించె, నక్కాలంబున నేనిట్లంటిని॥

నార—సురాసురులారా, కార్యకార్య కారణ కర్త్రాత్మికంబైన భూతేంద్రియ మనోమయంబగు, నహంకారంబే, రజస్సత్వ తమో గుణరూపంబగు ప్రపంచంబయ్యె, నయ్యహంకారంబు, శ్రీహరి తానాత్మశక్తి యందద్వితీయభావంబున నిలచి, సృష్టి, స్థితి, లయంబు, లకాథ్యక్షైక్షణంబున యనంతకోటి యజాండంబులు సృష్టిస్థితిలయంబును దధితరంగ న్యాయంబున, సర్వాత్ముండగు హరితనయందు గల్పించుచుండును గావున, హరికిని, విశ్వమునకును, వేరుసేయరాదు, భ్రాంతి జన్యాత్ములకు, భిన్నములుగాదోచి దుఃఖసుఖంబు లనుభవింప జేయుచుండును

భాగ-కం॥ హరిమయము విశ్వమంతయు। హరివిశ్వమయుండు సంశయ
ముబనిలేదా। హరిమయముగానివస్తువు। పరమాణువు లేదు
వంశపావనవింటే॥ విశ్వమనగా ప్రణవమని యర్థమున్నది॥

అనుప్రహ్లాదవాక్యము జ్ఞప్తికిదెచ్చుకొండు, మీరలు త్రిగుణావిష్టులై పలువిధంబుల దలంచుచుంటిరిగాని, గుణవ్యతిరిక్తుండును, ప్రాప్య-ప్రాప

క_ప్రాప్తి- భేదరహితుండునగు హరిని సర్వాంతర్యామిగా భావింపుము. మున్ను సనకసనందనాదులతో నేమను వైకుంఠపురంబున కేగితి, నప్పుడు జయవిజయులకు నాదిగంబరులు శాపంబిడునప్పుడు, వారిముఖవిలాసం బాగ్రహంబభినయించుటలో లోకరక్షణార్థము, యేయుపాయంబునన్నైనను భగవంతుని వైకుంఠమునుండి, వెడలింపవలెనను తమగోరిక, కనుగుణముగా భగవదన్యమూహింపరాని, జయవిజయులను స్థానభ్రష్టత్వమొనరింప తరిదొరికెనను సంతోషము సూచించినది. ఉభయవాదుల శాపవిషయిక కలకలములాలించి, శ్రీహరి దనభక్తవత్సలత బయల్పడ రమాసహితుండై ద్వారంబుకడకు నరుగుదెంచె నాయుభయ విభూతిదాయులగు యాదిమదంపతుల ముఖపద్మంబులు వీక్షించునెడ సమశీతోష్ణకాంతులు నేత్రములనుండి. వెడలి దిశలంగ్రమ్మ, మందహాస సుందరవదనారవిందంబొక్కంత, భయ, విస్మయా, నందంబులు ముప్పిరిగొను చందంబభినయించుచున్న గాంచి భక్తజనేతరుండుగానందున, నీశాపంబీయనను వ్యాపించినట్లునాకుదోచె నా(శ్రీ)హరితాను బ్రాహ్మణతిరస్కారణకు సహింపజాలననియు భృగువునకు భక్తిసేవసల్పితిననియు, తనకు బ్రాహ్మణుండే భగవంతుండనియు, తద్బ్రాహ్మణ ప్రభావంబద్భుతముగా ననేకరీతుల నిస్సంశయముగా మేఘగంభీరభాషణంబుల, మాకెల్లరకెరింగించె, నాభృత్యులొనరించు తిరస్కారణంబే నొనరించిన దగుటంజేసి, మన్నింపవలయునని యమ్మునులబ్రార్థించెను-

తాపసులు స్వామివాక్యంబులాలించి నిందించినదియు నానందించినదియు సంకోచించినదియు దెలియజాలక వివేకించి తమయందు దయగల భావంబెరింగి ప్రసన్నహృదయులైరి. అంత నామునులు శ్రీస్వామివారి, దివ్యమంగళ విగ్రహంబు బలుమారువీక్షించి స్వామీ మీకొమారుండగు మాతండ్రి, తమ (శ్రీ)యీదివ్యమంగళ విగ్రహంబు రహస్యార్థముగా నుపదేశింపబడి చతురింద్రియ గ్రాహ్యంబుగామింజేసి మేమనయము ధ్యానింపుచుండ నిక్కాలంబున మాకు సిద్ధించె, కృతార్థులమైతిమి. పరమపావనులగు తమపాదసేవకుల దూషించిన దోషంబుక్షమించి కాపుమనిరి. అంతట స్వామి నాము, లోకరక్షణార్థమరుదెంచిన

తాపసులనిజోద్దేశ్యమెరింగి వారియిష్టము దీర్పదలంచినట్టి విభవము స్వామివారు దమ దృగ్విలాసంబున దేటపరచిరి-

నార—అప్పుడేనిట్లనిదలపోసితిని, దేవాసురుల ప్రారబ్ధంబులు సనకసనందనాదుల హృదయగతంబున స్పృహావశతా ప్రవేశించి యది దయారూపంబున పరిణమించి తద్రక్షణార్థము వైకుంఠగమనంబుగల్పించి యింతకుదెచ్చినది. యిది ప్రారబ్ధమైనను సాధులహృదయమునుండి ప్రబలినదగుటవలన దేవాసురులకు శుభప్రదంబని దలంచితిని.

అట్లుగాకున్న భగవంతుండే శాపవశంబున నరసింహరూపంబుదాల్చె నీమూర్తి హిరణ్యకశిపుని యుపాసనామూర్తి కాకున్న రాజస-తామస- గుణంబుల కనుగుణంబుగా (నర-సింహ) మూర్తులోకరూపంబున దోచుటెట్లుగలిగె. భక్తునకు స్వాభావికముగాగాని, యాగంతుకముగాగాని, సంభవించిన గుణంబులు భగవంతునియందు దోచవలసినదేకదా భక్తపరాధీనుండగు హరి తనభక్తునకు నుత్కృష్టవిశేష శరీరంబొసంగి తాను జడంబును సాంకర్యంబునగుతిర్యఙ్నరరూపంబులు ధరియించుట గనుగొనలేదా-

కాకభక్తుండు శేషభూతుండగుటంజేసి, తదాత్మశేషమగు శరీరంబారగింప పాత్రంబగునని తెల్పుచందంబున, దారక్తమాంసంబులాహారింప యోగ్యంబగు సింహవక్త్రంబు ధరియించిరి ప్రేవులు వైజయంతీమాలికాదులతోపాటుకంఠహారములుగా దాలిచె లక్ష్మీమన్మథులకు యోగ్యమగు అంకతలంబున నడ్డబాలునిజేసె జగద్రక్షదీక్షాకరంబగు తననేత్రయుగ్మంబు భక్తునిహృదయపద్మంబునఁ జేర్చి మోక్షకవాటంబు తెరచుభంగి స్వనఖకుంచెలచేదెరచి తద్హృదయకమల మధ్యస్థమగు యాత్మను, నీవారశూక, సూక్ష్మమోక్షద్వారంబున వైకుంఠంబునకనిచె (రాత్రిబవలు) చీకటివెలుతురు, జ్ఞాము అజ్ఞానము, సంకల్ప వికల్పములనుద్వంద్వములుగాని సమయమున అరక్షణంబున ముక్తిగలిగించె దత్కార్యంబుననేకదా, శ్రీహరినిగని కృతార్థులమైతిమి నిరాకారసాకారములయందు, హరితుల్యులెవరో ప్రపంచంబున గనుగొనుము, మనరక్షణార్థము భగవంతుండే ప్రహ్లాదునిజూపె మీమీప్రారబ్ధ

వృక్షంబులు బ్రహ్మపుత్రుల పోషణవలన మోక్షఫలంబులు ఫలించె

మున్నితనితల్లిని చెరబట్టునాడీమెగర్భంబున విష్ణుభక్తశ్రేష్ఠ సంభూతుం డగుబాలుండుద్భవించి, సకలభూతంబులకు మేలొనరించునని దెలిపిన, నావాక్యంబులు నేటికి ఫలించె నీతండు నాచే జ్ఞానోపదేశంబువడసిన వాడగుటంజేసి సర్వమును భగవత్స్వరూపముగా భావించుట నైజ మీతనియందుగాని యీతనితండ్రియందుగాని యెట్టిసంశయంబులూహింపరాదు, హరిభక్తి మనంబునం దెంతకాలముండు నంతకాలంబంత యు ముహూర్తకాలంబని, యీయనఘుని యుద్దేశ్యమైయున్నది. గాన గులధర్మంబు దప్పింపరాదు, కావున గురుండగు శుక్రాచార్యులవారి యాజమాన్యమున ప్రహ్లాదపట్టాభిషేక తంత్రంబుసాగింపు డిది యెల్లర కు శోభనంబొసంగునని నిశ్చలమనంబున వక్కాణించితి నంత భృగుమ హాఋషి పరమానందంబఖిలేంద్రియంబుల నభినయించుచు నిట్లనియె.

భృగువు—— భా- గీ॥ అలుకనైన జెలిమినైనగామంబున। నైన బాంధవముననైనభీతి। నైన దగిలితలప నఖిలాత్ముడగు హరి। జేరవచ్చు వేరుసేయడతడు॥ ఈయదార్థమును పూర్వోక్తరూపమగు హరికథావి శేషంబు లీనారదుని బోధవలనలభించెను హరి మహాత్మ్యంబభివర్ణింప దద్భక్తాగ్రేసరులకేగాక నొరులభివర్ణింపజాలరు. గురుశుక్రులేకరాసి గత్తులైరి, వారలాడినవాక్యంబులు భాగవతధర్మంబులును, సర్వలోకా నందకరంబులునై సభ్యుల హృదయపద్మంబులు వికశింపజేసినవియై యున్నవి. యేతద్భగవత్కథాభివర్ణనకు దేవదేవుండగు కమలభవుడు ప్రహ్లాదునింగూర్చిచేసిన ప్రశ్నయే బీజభూతంబైనది, సభాపతియగు క మలాసనుని నమ్మకమేశుభస్యశీఘ్రంబనువచనంబు దలంపునకువచ్చి నదని దెల్పె.

నార——భృగుమహాఋషిసామగానప్రియుడనియొదీర్ఘకాలంబొకచో నివసింపడనియో ప్రహ్లాదునకు జ్ఞానోపదేశంబొసంగినవాడనియో లీలా వతీ గర్భరక్షకుండనియో, నేదియో నొకవిశేషంబు న్నాయందుగల్పిం చుకొని, సామవేదోక్తాశీర్వచనంబున కాధ్యునిగా నిర్ణయించి, మజ్జన కుని యనుజ్ఞగైకొని, అక్షతల నాకొసంగిరి, మాతండ్రి మొదలగు

సురాసురమునిగణంబులు, యక్షతలంది, యాశీర్వచనంబులు తథాస్తు వాక్యంబులు శోభిల్ల భేరిమృదంగాది మంగళవాద్యంబులు మొరయ, నప్సరసలాడ, గీర్వాణులు గంధపుష్పమాలికాదుల లంకరింప, జయజయ శబ్దంబులు ధ్వనింప, అష్టదిక్పాలులు ఛత్రచామరాదులు వహింప, విధి సన్నిధానంబున శుక్రుండును, దేవీసహితుండై మహిషీయుక్తుండగు ప్రహ్లాదుని, రక్షోలోకరక్షణాధీశునిగా సింహాసనస్థునిగావించి, సామవేదోక్తాశీర్వచన పూర్వకంబుగా, కిరీటంబు లిరువురిరువురకుం, మస్తకంబులనిల్పి, స్థిరోభవ- వరదోభవ- సుప్రసన్నోభవ- అని మహాదాశీర్వచనపూర్వకంబుగా నక్షతలిడిరి. బ్రహ్మాది సురాసురముని గణంబులాశీర్వదించి యక్షతలిడిరి లక్ష్మీసరస్వతిపార్వతులు కర్పూర నీరాజనంబులువహించి మంగళంబులుబాడిరి- నేనంతట నాతండ్రిగారికి నమస్కరించి, సభవారిశల్వంది బయలువెడలునప్పుడా ప్రహ్లాదుండు, శుక్రుననుజ్ఞవడసి యాధారాది షట్కమలంబులు అకార- ఉకార- మకార- సంజ్ఞాతంతుపునం బెనచిన, ఓకారంరసూత్రంబునంగూర్చి, సహస్రదళపద్మంబును మేరువునిల్పి, యష్టదళపద్మంబును పతకంబుగాసృజించి, చందనపుష్పాక్షతలచే ననన్యభక్తి యుక్తంబుగాపూజించి, నాకంఠంబునందలంకరించె, సభ్యులందరు నమస్కరణ పూర్వకంబుగా జయజయధ్వానంబులతో గరతాళంబులువేయుచు, భగవత్సంకీర్తనంబొనరింపుచు నన్నుగౌరవించిరి, అంతట నేను యధేచ్ఛాగతుడనైతి, నిది యా ప్రహ్లాదపట్టాభిషేకోత్సవ విభవముఅని శౌనకాద్యఖిలమునిగణ సమేతుండగు సూతునికడనుడివిన, నచ్చటిసభ్యులందరు పరమానందమగ్నులైరి. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శుభంభవతి॥

నైమిశారణ్యంబుననున్న సభలో శ్రీనారదమహామునీంద్రుని బహూకరించుట॥

---

శౌన— నారదగురువర్యా, మీరుపన్యసించిన యర్థంబనంత కళ్యాణగుణాలంకారుండగు విష్ణుండు విశ్వమూర్తియై నిజమాయావిలాసం

బునఁ బ్రభోగించుచున్నట్లుల విశదమయినది. ఇందు బ్రహ్మవచనంబులు మోక్షధర్మోపదేశంబులైయున్నవి ప్రహ్లాదవాక్యంబు లుపరమధర్మం బుద్ధరించినవి దేవాదికలకలంబులు సకలధర్మస్థాపనీయంబులైయున్నవి శుక్ర-బృహస్పతి- వాక్యంబులుయథార్థగుణాలంకారంబులు వహించిన వయ్యును యేకత్వసిద్ధిని బొందుపరచినవి భృగువుదాను మున్నాత్రి మూర్తుల విమర్శించి నిల్పినయర్థంబు సిద్ధాంతీకరింపబడుటకలరి, నిర్మాత్సర్యస్వభావంబెరుకపరచే ప్రహ్లాదపట్టాభిషేక మహోత్సవంబు శ్రీ సచ్చిదానంద పరబ్రహ్మవలోకనతత్పరత్వమందించినది. యేతన్మహా మహిమలన్నియు పరబ్రహ్మణ్యమూర్తులగు తమవాగమృతలహరికావీచికలం పరిభ్రామ్యమాణంబులై నానావిధాలంకార శోభితంబై, సకలమునిగణ సేవ్యంబై, విష్ణుపాదంబనవిలసిల్లినై మిశారణ్యవాసులమగు మామనంబులలకరించినవి మిక్కిలిగా హిరణ్యకశిపుని మనోదృఢంబగు శుద్ధసాత్వీక నిష్ఠబయల్ పడజేసితి, రిట్టి శ్రీహరి స్వరూపోపదేశంబొసంగిన పరమగురుండవగు, మీపాదపద్మంబులయం దస్మన్మనంబు లప్పించుచున్నామని నమస్కరించిరి.

## సభాధ్యక్షుండగు సూతుండు

సూతుండు—ఋషివర్యులారా నేడు హరివాసరంబు నిఖిలవేదవేదాంత రహస్యార్థసంపుటీ కరణంబులును, సర్వపావనంబులగు యర్థంబులు ప్రహ్లాదపట్టాభిషేక మహోత్సవరూపంబున, నీనారదఋషీంద్రుండు, మనకు విశదీకరించి, పూతహృదయులంగావించిరి. సర్వసంశయవిముక్తిబడయగలిగెను, ముహూర్తమాత్రంబున దక్షప్రజాపతి సంతతినంతయు, మోక్షప్రాప్తులగావించిన యిమ్మహాత్మ్యనభివర్ణింప నేరికిదరంబుగాదు.

శ్రీహరిని నిందించిన హిరణ్యకశిపుండునురాక్షసులును, కన్నతండ్రిని నిందించినప్రహ్లాదుండును, ఋషులనిందించినజయవిజయులును, హిరణ్యకశిపునదూషించిన యింద్రాదిదేవతలును, యథార్థమూహించి పలికిన తమవాక్యసంతతిచే నిర్దోషులైనట్లు దెలియబడి పరమపవిత్రులై

ముక్తినిగాంచగలిగిన నీయర్థంబతిగోప్యంబు, మీవలన నీయర్థంబెఱింగి న మేమును మోక్షలాభప్రాప్తులమైతిమి, నారదరూపంబున పొడజూపిన గురుండగు శ్రీహరివైన మీపాదపద్మంబులు, నవవిధభక్తియుక్తంబుగా నభ్యర్చింప నర్హంబనిన పుష్పగంధాక్షతలేక కాలంబున సభ్యులందరు కరకమలంబులంబూని యేకాగ్రచిత్తులై॥

హరిః-ఓం॥ సహస్రశీర్షందేవం అను మంత్రంబున పుష్పాక్షతలర్పించి, పునఃపునః ప్రణామంబులొనర్చి, తన్నిర్మాల్యంబులు శిరసావహించిరి. పిదప సభ్యులసెలవంది నారదుండు యథేచ్ఛంజనియె॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శుభంభవతి॥

మంగళహారతి—: చేకొమ్మామంగళము- స్మరాకారకోకారి లో
కాప్తలోకన ॥చె॥ వేవేగరై వారమీవేళ జేయుదు దేవాసుధావా
క్యోభావాక్కులొసగుము ॥చె॥ నీవారశూకావద్భావాముగాంచిః।
నీవైభవమజాదిదేవత లెరుగరు ॥చె॥ కేవలమైరుద్ధమై వెల్గుయోగ
ము। చేవెలశినయోగి సేవగైకొనుతండ్రి ॥చె॥ లావుగబత్తుల లక్ష్మ
య్యాదహరాకా। శావేల్లనముగొన్న శ్రీవాసుదేవేశ ॥చె॥

కం॥ ఈమంగళచారిత్రం। బేమహనీయులుపఠించి యెరిగింతురొవా।
రామాధవుపదపద్మము। లేమరకభజించునట్టిశ్రీగాంతురొగిన్॥

(కవిప్రార్థన)

ఉ॥ భాగవతార్థమున్ దెలుపబ్రహ్మకు శూలికిరాదటంచుమున్।
భాగవతంబొనర్చిన ప్రభావుడు బమ్మెరపోత నాహ్వయుం।
డేగతిబల్కెనేననగనెంతటివాడను దెల్పమద్గురుం।
డేగతి యానతీయనటులే లిఖియించితి వాక్యపద్ధతిన్।
యోగులభోగులన్ హరినియోగులత్యాగులగొల్చువాడనా।
బాగుదలంచు సత్కవులబండితులన్ సవరింపవేడెదన్॥

ఇట్లు బుధజనవిధేయుఁడు,

బత్తుల లక్ష్మయ్య.



శ్రీ రస్తు.

గురుజనదూషణ విషయిక

# గురుశిష్య సంవాదము

హరిః॥ఓం॥ గురుర్బ్రహ్మా గురోర్విష్ణు గురుదేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పరబ్రహ్మ। తస్మైశ్రీగురవేనమః॥

శి ప్రశ్న—అయ్యా గురునిందజేయు పామరులగతి యేమగును.

గు ఉత్తరము—మేలగును.

శి—ఎట్లు

గు—ప్రపంచార్థమంతయు దుఃఖభాగమనియు, సుఖభాగమనియు రెండువిధములు అందుసుఖభాగము, దైవలక్షణము దుఃఖభాగము ప్రకృతిలక్షణము అట్టి ఆనందమే లక్షణముగాగల పరబ్రహ్మస్వరూపుడగు గురునినిందించినను భూషించినను వారలకు కలిగినను ఆనందమే కలుగునుగాని దుఃఖమెప్పటికిరాదు. అందువలన నెట్లునుమేలేకలుగును.

శి—గురునిందజేయు జ్ఞానికేగతికలుగును.

గు—జ్ఞానమనగా భగవంతునిదెలియు వ్యవహారమైయున్నది. అట్టి భగవంతుని దెలియువాడేజ్ఞాని అతనికి భగవత్స్వరూపుడగు గురునినిందించుట కలుగదు కలిగెనేని జ్ఞానియనుటవలనుపడదు అజ్ఞానియనినవానికి పరనింద సహజగుణముగాన నేరములేదు. కలిగినమేలే కలుగును.

శి—ఈయభిప్రాయమును బట్టిచూడగా భగవంతుడగు గురునిగూర్చి భూషించినను దూషించినను ప్రయోజన ప్రమాదములు కలుగనట్లే తేలుచున్నవి. జ్ఞానిదూషింపడు అజ్ఞానిదూషించుట సహజము అట్లైన గురుస్వరూపుడగు దైవదూషణచేయరాదను నియమమేల?

గు—ఆనియమము దూషణభూషణ తిరస్కారములను జెందని దై వము విధింపదు, తద్దైవోపాసకున కాసంగతివిశదమైయుండుటచే నత డును విధింపడు, తదితరులా నియమము విధించినను ప్రయోజనము లే దు. గాని భక్తినిల్పుటకై యభ్యాసకులకార్యలట్లు విధించిరి. ఆరూ ఢులకు విధినిషేధములు లేవు.

శి—దైవస్వరూపుడగు గురునినిందించిన తదుపాసకులువిని సహిం పవచ్చునా దైవనింద జేయువాని నాలుకగోయవలయుననియు నందు కుచాలకున్న తాను మరణించవలయుననియు నందుకుచాలకున్న కర్ణ ములుమూసికొని తత్ప్రదేశమువిడిచి వెళ్ళవలయుననియు భాగవతము నందు చెప్పియున్నదిగదా దీనికేమిచెప్పెదరు. [భాగ- చ॥]

చ॥ నెలకొని ధర్మపాలనవి ॥ నిర్మలుభగుణ దిరస్కరించున ।
కలుషుని జిహ్వగోయదగు ॥ గాకటుసేయగ నోపడేనిదా ।
బొలియుట యొప్పు రెంటికిబ్ర ॥ భుత్వము జాలమికర్ణరంధ్రముల్ ।
బలువుగమూసికొంచుజన ॥ బాడియటందురు ధర్మవర్తనుల్ ॥

గు—సర్వసాక్షియుసర్వవ్యాపియునగుగురునినిందించిన నతనికే య భిమానము లేకున్న తదుపాసకున కింతయేల తనను దూషించినవాని విష యమును రాజేసహించిన సేవకునకేల నింతదురభిమానమందున స్వా తంత్ర్యదోషమాపాదించును॥ గీ॥ తాను జేసిన కర్మంబు తన్నె గాల్చు వేరెవానికికీడొదవింపనేల॥ ననుసూక్తినిదలంపరాదా యిదియునుప చారవాక్యమేగాని అభ్యాసకునకు చెదరిన మనము నిధిధ్యాసయం దు నిలుచుటకిట్లనిరి. అంతయోపికచాలకున్న వానినాలుక కోయవల యుననిన సంగతికి భగవంతుడగు గురుని నిందింపకుండునట్లు గురుప్ర భావమును ప్రబోధించి నాలుకకదలింపకుండునట్లు చేయవలయు నందు కు శక్తిలేకున్న దానహంకారశూన్యుడుగావలయును నందుకుజాల కున్న తత్ప్రదేశములనగా తానప్పుడున్న ప్రాకృతదేశము (విషయజ్ఞప్తి) విడిచి కైవల్యమగు ఉపదేశము (నిర్విషయజ్ఞప్తి) నందు జేరవలయు నన గా సమాధిస్థితుడై యుండవలయుననుట.

శి—ప్రకృతి సంబంధమగు దుఃఖస్వరూపులయిన పుత్రమిత్ర కళ త్రాదుల దూషణ యేవిని సహింపజాలక మరణదశనుకూడా పొందుట కుగాని పొందించుటకుగాని దలంతురుగదా, కేవలానంద స్వరూపుడ గు గురుని నిందించుటయందు తదుపాసకున కెట్లుమనమునిలుచును.

గు—ఇదియు నభ్యాసవాక్యమేగాని యారూఢవాక్యముగాదు అ భ్యాసములేక నారూఢముకాదు గాన అభ్యాసవిషయముకూడా కొంత విచారింపవలసియున్నది. గురునింద కవకాశముగలిగించినది గురుడా దూషకుడా యుపాసకుడా యను విషయమును విచారించవలయును. ఆనందమే స్వభావముగలిగినట్టియు నిర్గుణస్వరూపుడగు గురునియం దారోపింపరాదు. దూషించువాడందమాస్వలోపపరిహారమున కాత ను దెలిసినవాడుకాడు. నిదురలోకలవరింతలకు దోషమేలేదు. ఉపాస కునకట్టి యవకాశలోపము సవరించుకొనుటకుపకారార్థములగుటచే దూషకుడుతనకుపరమమిత్రుండగును. ఏకారణములేకయే గురునిందజే యుదురనిన భర్తృహరి॥ గీ॥ కసవుచేసీటిచేమోదకలనచేత। బ్రతుకు మృగమీనసజ్జనప్రకరములకు। శబరకైవర్తసూచకజనులుజగతి। కార ణములేని పగవారుగారెదలప॥

యిట్లేకారణములేకయే సూచకజనులు నిందింతురనిన కారణములే క కార్యమెందునుగలుగదు. కారణంవినాకార్యంననిర్వతిమృగములయొ క్కయు, మత్స్యములయొక్క యుహింసకుఆహారార్థకమేకారణము. సజ్జ నదూషణకు సహజవిషయానందలోలాత్ములగు ప్రాకృతసంఘములో నుండి నిర్విషయానందలోలతకుపాటుబడుచు భగవదుపాసకులైమెలం గుటచే పునర్విషయలోలులగుదురేమోయని యప్పుడప్పుడు స్వవిష యాభిమానయీర్ష్యాదులచే పరిశీలించుటయేకారణము. అయితే యె వరికి నేయపకారమాచరించని మృగములకు మత్స్యములకు సజ్జనులకు కారణముదోచకుండెను గాన లేదనిరికాని విలక్షణదృష్టిచే విచారించిన కారణమునుండితీరవలయును. యిదిగాకలోకమునందు పామరులవాక్య ములయినను బాహ్యామునకు నిందారూపముగాదోచి కార్యార్థికి మేలు కలుగజేయుచుండును. కొన్నియడలస్తుతిరూపముగాదోచి కీడుగలిగిం

చును. యీ స్తుతినిందలు - మానసిక, కాయిక, వాచకములని ము త్తెరంగులు. యిందు బాహ్యాభ్యాంతర భేదములు రెండు కలవు. ఉద్దేశ్యము లేనిది. ఉద్దేశ్యముకలది. యెన్ని భేదములుండినను, యేరూపముగా దోచినను ఆరూఢునకుగాని యభ్యాసకునకుగాని సర్వదా మేలునే కలిగించును.

ఎట్లనిన, ( అభ్యాసకునకు ).

శ్లో॥ ప్రారబ్ధం భోగతోనశ్యే త్తత్త్వజ్ఞానే నచంచితం। ఆగామి ద్వివిధంకర్మ తద్వేషిప్రియవాదినాం॥ సంచితప్రారబ్ధకర్మములే అనృతజడదుఃఖాత్మకమగు జన్మహేతువులనియు, ప్రారబ్ధమనుభవించుటచే తీరుననియు, సంచితము తత్త్వజ్ఞానముచే నశించుననియు ఆగామిసంబంధమగు పుణ్యాపాపములు రెండును దూషించినవారికి పాపమును భూషించినవారికి పుణ్యమును జెంది, యుపాసకుడందున కర్మరహితుడై నిత్యానందమగు జన్మరహితసుఖమునే పొందునని చెప్పియుండిరి గావున యీనిందించిన పామరులు జ్ఞానులకెట్టి యుపకార మొనర్చినవారగుచున్నారో చూడుడు.

ఆగామికర్మను వారలేహరింపకున్న, జ్ఞానులెట్లు ము క్తినిపొందుదురు. సంచితప్రారబ్ధములొకవేళ తత్త్వజ్ఞానముచేతను, అనుభవముచేతను పోయినను ఆగామిపోకున్న నదియే సంచితముగానిలిచి కొంతభాగము ప్రారబ్ధముగా ననుభవింపజేయుచు తిరిగి యెప్పటియట్ల జన్మదుఃఖములు గలిగించునుగదా. అప్పుడు తత్త్వజ్ఞానమును దానిని దెల్పు గురువును అనుభవించిన, తానును యెట్లు ప్రయోజనకారులయిరి. యిందునబట్టి చూడగా నీపామరులే తనకు ము క్తి గలిగించి నిత్యసుఖ మిచ్చినవారుగా దలంచుటయం దేసంశయములేదు. పుణ్యముసంగతి యట్లుంచుము. అయ్యో! జ్ఞానులెట్టి ఘోరపాపమాచరించిరో యట్టివి తాముగ్రహించి యీఘోరదుఃఖము లనుభవింపుచు జ్ఞానులను పవిత్రులజేసినవారికి చేయవలసిన మహోపకారమెయ్యదియో యోచింపుడు. యిదియునుగాక పామరులప్పుడప్పు డంతటంతట జ్ఞానులను తనిఖీజేయుచుండుటను గదా, దుర్విషయములజనక క్రమముగా ము క్తినిపొందుచుండిరి. వీరు

జ్ఞానులయ్యుండి యిట్టి దుర్విషయములకేలజొచ్చితిరని దర్పించు పామరులకంటె నిర్విషయానందమును బొందుమను సాధులంత ఘనులా గాక పామరులనుటయేతప్ప వారల నయానయ వివేకముకూడా కొంత విచారించిన తెలియబడకమానదు. వారలచే జడపదార్థములగు మృచ్ఛిలాదారువులను, కరచరణాద్యవయవములను సృష్టించియు సృష్టింపకయును ప్రతిష్ఠించి వాటియందు కేవలానందస్వరూప భగవదారోపణముచేసి, వినయభయభక్తులతో నెట్లు పూజించుచుండిరో చూడుడు. తాము బంగారుభూషణములు ధరించినవారయ్యును వారాదైవారోపణజేయు విగ్రహములకు, వెలహీనమగు యిత్తడిమొదలగు భూషణములలంకరించియును ఎంత గౌరవముగా జూచుచుండిరో కనుగొనుడు. తామన్యోన్యము వేలు, వందలు బహుమతులందియును భగవత్ప్రసాదమగు నిర్మాల్యమగుతులశిదళమునకెంత సంతసించుచుండిరో విచారింపుడు. ఏయవయవములుండినను, ఎట్టిజ్ఞానేంద్రియములు కలిగియుండినను, తద్వికారములబారయక నిర్వికారముగా నుండుటలుజూచిగదా భగవంతుడని దలంచిరి. అట్టి వికారహీనమగు భగవంతుని జ్ఞాను లుపాసించినందుకు క్రియదోచకున్నందున వారిట్లు నిందించుటకు తగరా. అట్లుండు జ్ఞానులకు సేవకపాత్రులయి చరించవలయునను కుతూహలముతో నెట్లు పరితపించుచుండిరో గనుగొనుటలేదా. జ్ఞానులయొక్క ముఖావలోకనకుగదా అజ్ఞానముఖదర్పణంబులు భగవంతుడు సృజియించుట. భగవత్స్వరూపులగు సాధువులు బాలోన్మత్తపిశాచులవతుగా, లోకమునందు సంచరింతురనుట వినలేదా. (బాలులు) అనగా అజ్ఞానులేకదా, అట్టివారి హితాహిత విచారములు భావనాశక్తిచే కనిపెట్టిగదా మనము శుభాశుభములను దెలియుట కవకాశము గలిగినది. ముఖవికారములనుగాంచి యద్దములను నిందింతురా. పామరజనులను, మహోపకారులనుగురించి వర్ణించుటకు బ్రహ్మాదులు జాలరనుట నిశ్చయము.

( ఇక నారూఢునకు )

నిందయనునది సంజ్ఞారూపమును, శబ్దరూపమునై యున్నది.

(సంజ్ఞయనగా) పెదవి విరుచుట, మొగముద్రిప్పుట, తలద్రిప్పుట మొ
దలయిన యభినయరూపము.

(శబ్దమనగా) భాషారూపము.

అభినయము శబ్దార్థమగుటచే శబ్దమునుమాత్రము ప్రధానముగా గైకొనవలయును. పెద్దలు శబ్దమునందుగల యర్థాదిక భేదములను విడిచి మృద్ఘటపటతంతున్యాయముగా ప్రణవముగా భావించుట యొక దీక్షగా సెలవిచ్చియుండిరి గావున, నందు నిందాస్తుతులే దోచవు. శబ్దము ఆకాశముయొక్క గుణమగుటచే యాకాశము ప్రధానముగా నిలచినది. తదాకాశము సర్వవ్యాపకమగుటచేతను (ఆకాశం శరీరం బ్రహ్మ) మను శ్రుతి ననుసరించి ఆనందస్వరూపుడగు భగవంతుని శరీరమై యున్నది. అట్టి భగవంతుని శరీరమునుండి గలిగినవాక్యమే ప్రణవము. అదియే నానావిధార్థాలంకారాదులచే ప్రకాశించినదగుటవలన నిందా దోషమూహింపరాదు. ఆ, హాయి యెప్పుడుకలుగునో నప్పుడు (నిశ్శబ్దో బ్రహ్మముచ్చతే) యను ప్రమాణానుభవమగుటవలన సర్వదానందమే ప్రధానముగా నిలచినది. సహజామనస్కసుఖ మిదియె. సత్యము. సత్యము. సత్యము.

శి॥— ఇట్టి గురునిందజేసిన పవిత్రులగు పామరులకు జ్ఞానులొనరించు ప్రత్యుపకారమేమి?

గు॥ — వారికి నిత్యానంద రూపమగు మోక్షము కలుగుట యందతిశ్రద్ధానిరూఢితో భగవంతుడగు శ్రీగురుస్వామిని ప్రార్థించుటయే ప్రత్యుపకారము.

శి—అట్లుప్రార్థించుటచే భగవంతునకట్టి పామరులయందు దయ గలిగినందులకు దృష్టాంతమేమి?

గు—గాఢతరదుఃఖప్రాప్తులగుటయే.

శి—అయ్యో! దుఃఖముగలిగిన ప్రయోజనమేమి?

గు—దుఃఖము మోక్షమునకు రైలుమార్గమువంటిది. జ్ఞానవాశిష్టమందు॥ క॥ ఘనదుఃఖమ నీచేతన్। పనిబడి పరమార్థమంది పరమా

త్ముని గా। న్గానగంటి ముక్తిమార్గం। బును జూపితిగాన నీకు ల్రముక్కడ జనుమా॥

ఇయ్యది నీహృదయంబున నిరంతరము నిర్మాత్సర్యంబున విచారించి తేని యసూయాద్యవగుణంబులు నశించి సదానందమును గాంతువని శిష్యునకు హితోపదేశంబుగా దెల్పి సంతుష్టుని గావించి మరియు నిట్లనియె. గీ॥ వెలకుమించిన యింద్రియ వితతి తత్ప్రి। యోజనార్థక వస్తు నియుక్త జగమె। కంఢు స్రృజియించి నిత్యసౌఖ్యమ్మొసంగు। దేవుడొక్కండుగలడని ధీగణించి, యేల మనుజులదూరుటలిష్ట శిష్య॥

సీ॥ ఆనాడరణ్యంబు లీనాడుదేశము లప్పుడు ధ్యానము లిప్పుడూఖు। లాకాలమునమును లీకాలమునఘను లప్పుడాశ్రమములు నిప్పుడింద్లు। నావేళకందమూ లాదులీవేళ షడ్రసయుక్త భక్ష్యభోజ్యసమితిమరి। యాతరినేకాంత మగుసుఖంబీతరి సంఘసౌఖ్యంబు నిశ్శంకదనరె। నిప్పుడిదివిధి యయ్యది యప్పుడవిధి। వృద్ధిచేగల్గె నిటువలె వృద్ధిలేక। నటులగల్గెను పూర్వోత్తరాదిభేద। మంతయేగాని యానంద మదియొకండె॥

గీ॥ జడలుముడులాయె వల్కలసమితి వస్త్ర। ములును తుంబీకమండలువులును కాంస్య। పాత్రలాయెను దండముల్ బడితెలాయె। నాయె రుద్రాక్షపేరులు నచ్ఛమాక్తి। కాది హారమ్ములిప్డు విద్యాప్రవృద్ధి॥

క॥ ఇది బత్తుల లక్ష్మయచే। విదితంబుగ దెల్పబడియె విబుధులరసియె। య్యది యనుభవదూరంబా। నది దిద్దగ నార్యు లాద్యులగుదురుదీనన్ ॥

శుభం.

సంపూర్ణము.

## —• శ్రీ గురుశిష్యసంవాదము •—

క॥ శ్రీగురుచరణాంభోజము। లే గడుభక్తి నెదనిల్పి యెలమి రచింతుఁ
భాగవతసేవ్యమగుభవ। రోగవిధూతార్థమఘునిరోధము దెలియఁ ॥

భవరోగి—స్వామీ! మీరువైద్యులుగా దోచుచున్నారు. మీపేరు యేమి?

భవరోగవైద్యుఁడు—నాపేరు భవరోగవైద్యుఁడందురు.

రోగి—1. అయ్యా! నాచెవికన్యశబ్దము వినరానంత బీగ్గరగాను, మాటలయొక్క రసమెంతవిశదముగానున్నదో తెలియజాలనంత స్మృతితోను, ఇట్లు జెప్పువారు లేరనునంత ధైర్యముతోను, ధైర్యబలమే నిఖిలవిభవముల కాస్పదమనుసంతోషముతోను నానోట మాటలు వెలువడుచుండును.

2. సిగ్గు తెలియనంత వయారముతోను, అసూయ మెరుగనంత సుఖముతోను, ఒరులగాననంత మత్తతతోను, తిరుగలేనంత బద్ధకముతోను శరీరముండును.

3. మరణమంత దుఃఖముతోను, గరళము మ్రింగినంత వేదనతోను, పిచ్చికలిగినంత వికారముతోను, బ్రహ్మరాక్షసుడనదగినంత భూతదయతోను మనస్సుండును. కావున యీలక్షణములను శారీరశాస్త్రప్రకారమువిమర్శించి గుణమునిర్ధారణచేసి అందుకుతగిన ఔషధముచే నారోగము నివర్తిఁచేయుడు. నీవేది నాయొద్దకలదికోరిన నదియంత యొసంగెద.

వైద్యుఁడు—ఈరోగము వాతపిత్తశ్లేష్మములను ప్రధానతత్వములు ద్వేషించినందున త్రిదోషసన్నిపాతుని, ఆయుర్వేదమువలన సిద్ధాంతము చేయబడినది. ఎట్లనిన-

| | | | |
|---|---|---|---|
| 1 అతిప్రసంగము | పిత్తవికారము | బ్రహ్మ- | రాజస |
| 2 స్వతంత్రము | వాతవికారము | విష్ణు- | సాత్విక |
| 3 అసూయ | శ్లేష్మవికారము | రుద్ర- | తామస |

యీ వాతపిత్తశ్లేష్మములయందేదియో యొకటి ద్వేషించిన యారోగము సాధ్యమనియు, రెండయిన కష్టసాధ్యమనియు, త్రిదోషమయిన దుస్సాధ్యమనియు చెప్పియుండుటవలన నిది నావలన సాధ్యమయినది కాదు.

రోగి—అయ్యా! యీరోగమువృద్ధియయిన చివరకు నన్నేమిచేయును?

వైద్యుడు—తత్క్షణమే మరణము నొందించును.

రోగి—ఎంతకాలమునకు పొందించును?

వైద్యుడు—ఇప్పుడు మరణము నున్నట్లే తలంపవలయును. నీకు రోగము తెలియనట్లేయున్నదని చెప్పుతూ మరణమెప్పుడనియెద వేల?

రోగి—వికారములు తోచుచుండగా మరణమెట్లయితిని?

వైద్యుడు—నీకు సంభవించిన త్రిదోషసన్నిపాతరోగముచే నీవు మరణించుచున్నది తెలియలేదు. నీకు బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యములని నాల్గుదశలు గలిగెగదా? యౌవనమందు బాల్యమేమయ్యెను. కౌమారమందు యౌవనమేమయ్యెను. వార్ధక్యమునందు కౌమారమేమయ్యెను. ఒకటిదోచినప్పు డదివరకున్నది నశించినదా? లేదా?

రోగి—నశించినది.

వైద్యుడు—ఎప్పుడునశించినది?

రోగి—ప్రతియేటను, నెలను, రోజును, గడియను, ప్రతిక్షణమునను పుట్టుట గిట్టుట కనుపడాసిదెరచినట్లు ప్రతిక్షణమును జరుగుచుండును.

వైద్యుడు—అట్లే నశించుచుంటివి.

రోగి—తిరిగి పుట్టుచుంటినిగదా.

వైద్యుడు—పుట్టినదియంతయు నశించుట స్వాభావికముగ దోచుచున్నప్పుడు పుట్టినదిమాత్రము నశించుటలేదా? మరలి మరలి పుట్టినను నీకు యీరోగము మాత్రమంటువదలదుకదా,

రోగి—యీరోగమంటుబాయుటెట్లు?

వైద్యుడు— పుట్టు గిట్టుటలుగల రోగము. పుట్టు గిట్టులేనినీకు ఉపాధి రూపముగా దోచినది. ఆయుపాధిరహితమెప్పుడగునో అప్పుడు నివృత్తియగును.

రోగి.—ఆయుపాధిరహితమగు మందు నాకిచ్చి భవరోగము మానిపితమకుగల భవరోగవైద్యుడను నామము సార్థకమొనరింపుడు.

వైద్యుడు—నాకేమిచ్చెదవు?

రోగి—నీవేమడిగిన నదియేయిచ్చెద.

వైద్యుడు—నీవేమిచ్చినను నాకు తృప్తి కలుగదు. నీవు నన్నన్నివిషయములయందు కనిపెట్టియుండెదవా?

రోగి—నారోగరహితమొనరించిన నిన్ను కనిపెట్టియుండునది యొకలెక్కగాదు. నిన్నెప్పుడు మరువను.

వైద్యుడు— నాచెప్పినట్లు పథ్యము తప్పకచేయుదువా?

రోగి—చేయుదును.

వైద్యుడు—నీచేయుట్లుదెమ్ము. (చేతికిచ్చిన పారజూచి) నీకీరోగము ఆగంతుకముగాని స్వాభావికముగాదు. స్వాభావికమైన అసాధ్యము. కావున అధిభౌతికమగుటచే దీనికి భూతవైద్యము చేయవలయును. ఇందుకు గాయత్రీమంత్రము ధ్యానమును, తన్మంత్రాధిదేవత లక్ష్యమును నిశ్చలభక్తితో చేయుము.

1. ఇందుకుపథ్యము నీకుపదేశించిన మంత్రమేకదా? నీకు వినుచు శబ్దములన్నియు అవి యెన్నివిధములుగా నీకు దోచినను నా మంత్రాంతర్భాగ శబ్దములుగా వినుము.

2. గాయత్రిమంత్రాధిదేవుండె సర్వస్వతంత్రునిగాభావించి నీవు దక్క తక్కినసర్వరూపములు నీయుపాసనమూర్తిగా గనుచుండుము.

3. అన్యవిభవములన్నియు భగవద్విభవములుగా తలంచుము. ఈమూడువిధములు అయిన విధులు నీరోగమునకు పథ్యములు చక్కగా జరిపితివేని నిత్యసుఖమందగలవు.

## —• ఉ భ య వా క్య ము •—

అనుభవించు నేనెట్లుందును? నావలెయుందువు. నీవెట్లుంటివి? నీవెట్లుంటివో నట్లుంటిని. నేనెట్లుంటిని? నీవు నేనుగాను, నేను నీవుగా నుంటిమి. యీామంత్రమువలన నే, నీ నా భేదముడుగు. అర్ధమున్నది. సత్యము. సత్యము. సత్యము.

ఇట్లు బుధజనవిధేయుడు,

బత్తుల లక్ష్మయ్య.

